# శ్రీరామదేవుని కథ

mohan
PUBLICATIONS

కాపీలకు : ☎ 246 2565



**మోహన్ పబ్లికేషన్స్**

అజంతా హోటల్ ఎదురుగా,
కోటగుమ్మం, రాజమండ్రి -533 101.

 2016 వెల : 20-00

---

# శ్రీరామదేవుని కథ

## నాగంభట్టు కాశీ ప్రయాణం

అనగా అనగా పూర్వకాలంబున ఒక బ్రాహ్మణుడు కలడు. అతనిపేరు నాగంభట్టు ఆయనకొక పుత్రుడు ఒక పుత్రిక కలరు. పుత్రునిపేరు నారాయణభట్టు. పుత్రికపేరు నారాయణమ్మ. వారు చాలా బీదవారు. భిక్షాటనచేసి కుటుంబపోషణ చేసుకొనేవారట అలా కొన్నాళ్ళయ్యేసరికి నాగంభట్టు కాశీకివెళ్ళి ధనము సంపా దించుకోవలయునను బుద్ధిపుట్టినదట భార్యతో చెప్పి తెల్లవారు జామునలేచి కాశీకి ప్రయాణమై అలావెళ్ళగా వెళ్ళగా కొంత దూరము వెళ్ళేసరికి దారిలో సూతులవారు, వ్యాసులవారు, నార దులవారు ప్రత్యక్షమయిరి. ఓ బ్రాహ్మణుడా! ఎక్కడకు వెడు తున్నావు? అని అడిగిరి అయ్యా! నేను కాశీకి ధనం సంపాదించు కొనుటకు వెళ్ళుచున్నాను. అని చెప్పెను. అప్పుడు వారు "వెర్రి బ్రాహ్మణుడా! కాశీకి వెళ్ళితే.. నీకు ధనము ఎవరయినా మూట గట్టియిత్తురా? కాశీకివెళ్ళితే గంగాస్నానము దొరుకుతుంది. విశ్వే శ్వరుల దర్శనందొరుకుతుంది. అన్నపూర్ణదర్శనం దొరుకుతుంది. మేము ఒక కథ చెబుతాము వింటావా? అని అడిగినారు. మీరు ఏ దేవుని కథో వివరించండి స్వామి అని వేడుకొనెను. పూర్వ కాలమున కోసల రాజ్యము కలదు. ఆ రాజ్యము పాలించే దశరథ మహారాజు కలడు. ఆయన పిల్లల కోసం పుత్రకామేష్ఠి

# శ్రీరామాష్టోత్తర శతనామావళిః

(ప్రతినామమునకు ముందు "ఓం" అని చివర "నమః" అని చదువుకొనవలెను.)

శ్రీరామాయ
రామభద్రాయ
రామచంద్రాయ
శాశ్వతాయ
రాజీవలోచనాయ
శ్రీమతే
రాజేంద్రాయ
రఘుపుంగవాయ
జానకీవల్లభాయ
జైత్రాయ
జితామిత్రాయ
జనార్ధనాయ
విశ్వమిత్రప్రియాయ
దాంతాయ
శరణత్రాణ తత్పరాయ
వాలి ప్రమధనాయ
వాగ్మినే
సత్యవాచే
సత్యవిక్రమాయ
సత్యవ్రతాయ
వ్రతధరాయ
సదాహనుమదాశ్రితాయ
కౌసలేయాయ
ఖరధ్వంసినే
విరాధవధపండితాయ
విభీషణపరిత్రాత్రే
హరకోదండఖండనాయ
సప్తతాళప్రభేత్రే
దశకంఠశిరోహరాయ
జామదగ్న్యమహాదర్పదళనాయ
తాటకాంతకాయ
వేదాంతసారాయ
వేదాత్మనే
భవరోగస్యభేషజాయ
దూషణత్రిశిరోహన్త్రే
త్రిమూర్తయే
త్రిగుణాత్మకాయ
త్రివిక్రమాయ
త్రిలోకాత్మనే
పుణ్యచారిత్రకీర్తనాయ
త్రిలోకరక్షకాయ
ధ్వనినే
దండకారణ్యవర్తనాయ
అహల్యాశాపశమనాయ
పితృభక్తాయ
వరప్రదాయ
జితేంద్రియాయ
జితక్రోధాయ
జితామిత్రాయ
జగద్గురవే
ఋక్షవానరసంఘాతినే
చిత్రకూటసమాశ్రయాయ
జయంతత్రాణవరదాయ
సుమిత్రాపుత్రసేవితాయ
సర్వదదేవాది దేవాయ
మృతవానరజీవనాయ
మాయామారీచహంత్రే
మహాదేవాయ
మహాభుజాయ
సర్వదేవస్తుతాయ
సౌమ్యాయ
బ్రహ్మణ్యాయ
మునిసంస్తుతాయ
మహాయోగినే
మహోదారాయ
సుగ్రీవేప్సితరాజ్యదాయ
సర్వపుణ్యాధికఫలాయ
స్మృతసర్వాఘనాశనాయ
ఆదిపురుషాయ
పరమపురుషాయ
మహాపురుషాయ
పుణ్యోదయాయ
దయాసారాయ
పురాణపురుషోత్తమాయ
స్మితవక్త్రాయ
మితభాషిణే
పూర్వభాషిణే
రాఘవాయ
అనంతగుణగంభీరాయ
ధీరోదాత్తగుణోత్తమాయ
మాయామానుషచారిత్రాయ
మహాదేవాదిపూజితాయ
సేతుకృతే
జితవారాశయే
సర్వతీర్థమయాయ
హరయే
శ్యామాంగాయ
సుందరాయ
శూరాయ
పీతవాససే
ధనుర్ధరాయ
సర్వయజ్ఞాధిపాయ
యజ్వనే
జరామరణవర్జితాయ
విభీషణప్రతిష్ఠాత్రే
సర్వావగుణవర్జితాయ
పరమాత్మనే
పరంబ్రహ్మణే
సచ్చిదానందవిగ్రహాయ
పరస్మైజ్యోతిషే
పరస్మైధామ్నే
పరాకాశాయ
పరాత్పరాయ
పరేశాయ
పారగాయ
పారాయ
సర్వదేవాత్మకాయ
పరస్మై
శ్రీరామచంద్రాయనమః

# శ్రీ సీతాష్టోత్తర శతనామావళిః

(ప్రతినామమునకుముందు"ఓం"అనియు చివర"నమః" అని చదువుకొనవలెను.)

శాంత్యై
మహేశ్వర్యై
నిత్యాయై
శాశ్వత్యై
పరమాయై
అక్షరాయ
అచింత్యాయై
కేవలాయై
అనంతాయై
శివాత్మనే
పరమాత్మికాయై
జానక్యై
మిధిలానందాయై
రాక్షసాంతవిధాయిన్యై
రావణాంతకర్యై
రమ్యాయై
రామవక్షస్థలస్థితాయై
ప్రాణేశ్వర్యై
ప్రాణరూపాయై
ప్రధానపురుషేశ్వర్యై
సర్వశక్త్యై
కలాయై
కాష్ఠాయై
జ్యోత్స్నాయై
మాద్యాయై
ఇందుమహిమాస్పదాయై
పురాణ్యై
చిన్మయ్యై
పుంసాదయే
భూతాంతరాత్మనే
కూటస్థాయై
మహాపురుష
సంజ్ఞితాయై
స్వనౌర్యాయై
కార్యజనన్యై
బ్రహ్మాస్యాయై

బ్రహ్మసంశ్రయాయై
అవ్యక్తాయై
ప్రథమజాయై
బ్రాహ్మ్యై
జ్ఞానరూపిణ్యై
మహత్యై
మహేశ్వర్యై
సముత్థానాయై
భక్తిముక్తిఫలప్రదాయై
సర్వేశ్వర్యై
నిత్యాయై
ముదితమానసాయై
వాసవ్యై
వరదాయై
వాచ్యాయై
కర్త్యై
సర్వార్థసాధనాయై
వాగీశ్వర్యై
సర్వవిద్యాయై
మహావిద్యాయై
సుశోభనాయై
శోభాయై
వశంకర్యై
లీలాయై, మానిన్యై
పరమేష్ఠిన్యై
త్రైలోక్యసుందర్యై
జ్ఞానసుందర్యై
కామచారిణ్యై
విరూపాయై
సురూపాయై
భీమాయై
మోక్షప్రదాయిన్యై
భక్తార్తినాశిన్యై
భవ్యాయై
భవవినాశిన్యై
వికృత్యై

శాంకర్యై
శాస్త్యై
యక్షగంధర్వసేవితాయై
వైశ్వానర్యై
మహాశీలాయై
భర్తృసేవాపరాయణాయై
గుహవత్సలాయై
హిరణ్మయ్యై
మహాదాత్ర్యై
సంసారపరివర్తికాయై
సుమాలిన్యై
సురూపాయై
తారిణ్యై
వాదిన్యై
ప్రభాయై
జగత్ప్రియాయై
జగన్మూర్తయే
స్త్రీమూర్తయే
అమృతాశ్రయాయై
నిరాశ్రయాయై
నిరాహారాయై
పతిభక్తివిరాజితాయై
శ్రీసత్యై
శ్రీమత్యై
శ్రీశాయై
శ్రీనివాసాయై
హరిప్రియాయై
శ్రీకర్యై
భక్తానుకంపాయై
ఈశవీరణాయై
శ్రీధరాయై
జనకాత్మజాయై
పురావేదవతీరూపాయై
సదాహనుమదాశ్రితాయై
సరసామృతదాత్ర్యై
శ్రీపట్టాభిరామప్రియాంగనాయై

యాగము చేయగా దేవతలు ప్రత్యక్షమై పాయస పాత్ర యిచ్చినారు. అది పట్టుకువెళ్ళి తన భార్యలగు కౌసల్య, సుమిత్ర, కైకేయి అను ముగ్గురు భార్యలకు ఇచ్చినాడు. వారు ముగ్గురు భుజించగానే గర్భవతులైరి. నవమాసములు నిండగానే చైత్రశుద్ధ నవమినాడు పునర్వసు నక్షత్రమున శ్రీరామ, లక్ష్మణ, భరత, శతృఘ్నులు అను నలుగురు కుమారులు జన్మించినారు. వారు దిన దిన ప్రవర్ధమానులై బాలచంద్రునివలె పెరుగు చుండిరి. కొన్నాళ్ళయ్యేసరికి విశ్వామిత్రుడు వచ్చి రామలక్ష్మణుల నిద్దరినీ యాగ సంరక్షణార్థం తనతో పంపమని దశరథ మహా రాజును అడుగగా విశ్వామిత్రునితో రామలక్ష్మణులను పంపు టకు దశరథుడు అంగీకరించగా ముని వారిద్దరికి "బల అతిబల లనే విద్యలను నేర్పెను.రాముడు తాటకిని చంపి శివుని విల్లు" విరిచి సీతను పెండ్లియాడి, అహల్యను శాపవిమోచనము చేసి పరశు రాముని గర్వభంగముచేసి, కైకవరము చేత పదునాలుగేండ్లు అరణ్య వాసములో వుండగా రావణాసురుడు సీతను ఎత్తుకొని పోగా, లంకాపురమున కేగి లంకాదహనం చేసి రావణాసురుని వధించి, విభీషణు నకు పట్టము గట్టి తిరిగివచ్చి పట్టాభిషిక్తుడై సుఖముగా రాజ్యమును ఏలుచుం డెను. ఇది రామదేవుని కథగా చెప్పి అయిదు లక్ష్మివారములు పూజలుచేసి ఆవునేతితో దీపంపెట్టి ఆవుపాలు, గోధుమరవ్వ, పంచదార కలిపి 5 వుండలుగా ప్రసాదము చేసి రామదేవునకు నైవేద్యము పెట్టవలెను. ఒక వుండ రామదేవునికి, ఒకవుండ బ్రాహ్మణునికి, ఒక వుండ ముత్తయిదువు నకు, ఒకటి యిరుగు పొరుగు వారికి, ఒక వుండ భార్యా, పిల్లలు తినవలెను. ఈ విధముగా 5 లక్ష్మివారములు పూజచేయవలెను. నిత్యం రామ దేవునికథ చెప్పుకున్న అష్ట ఐశ్వర్యములతోయిష్ట సంపదలతో తుల తూగుదురు. అలాగున కొంతకాలమయ్యే సరికి ఇది వరకే కాశీకి వెళ్ళవలెననుకున్నాడు. కాని వెళ్ళలేదు. ఇపుడు వెళదా మనుకొని కొంచెము ధనము మూటకట్టుకుని కాశీ కావడి భుజం మీద వేసుకుని కుమారుని, కుమార్తెనుపిలచి, అబ్బాయి, అమ్మాయి మీరు కథ విడువకుండా శ్రద్ధగా చెప్పుకుంటూ వుండ మని నారాయణమ్మతోనూ,నారాయణభట్టుతోనూ చెప్పి కాశీకి ప్రయాణమై వెళ్ళిపోయెను. ఆ మరునాడు కుమారుడు ఆయ వారమునకు వెళ్ళివచ్చి అమ్మా రామదేవుని కథ చెపుతాను విందువుగాని రామ్మా అని పిలిచెను. నాయనా! వంటవేళ ప్రొద్దున్నే దాసి పాచిపనికి...వచ్చే

వేళ అయినది. ఇపుడు కథ వినను అనెను. మళ్ళీ మధ్యాహ్నం కథ చెపుతాను విందువుగాని రావమ్మా అనెను. ఇప్పుడేమి కథ నాయనా! పడకవేళ, నిద్రవేళ ఇప్పుడు వినను అనెను. రామదేవునికి కోపమువచ్చి ఎలా వచ్చిన ఐశ్వర్యములు అలాగునే వెళ్ళిపోగ బిందెలు, చెంబులు, గిన్నెలు అన్ని దొరలి యిరుగుపొరుగువారి యిండ్లకు వెడలి పోయెను. పూర్వము నుంచి ముష్టి ఎత్తుకునే చిల్లు రాగిచెంబు కూడా దొర్లి వెడలిపోవుచున్నదట అపుడు నారాయణమ్మ చూచి అమ్మా! అదయినా వుంచమని కోరవే అమ్మా! అని చెప్పగా ఆమె అదయినా వుంచు రామదేవుడా! తండ్రీ అని వేడగా ఆ చెంబు తప్ప మిగతావన్నీ వెడలి పోయినవట. వారి గూటిలో వున్న వెండి కంచము కూడా దొర్లిపోవుచుండగా అపుడు ఆమె కంచము అంచు పట్టుకొనిలాగినదట సగము అంచువారికి, సగము అంచు పొరుగువారికి వెడలిపోయినదట, మరునాటి ఉదయమున ఆమె వారింటికి నిప్పుకొరకు వెళ్ళి వారింటిలోనున్న కంచము అంచు మాదే అన్నదట. మీ కంచము అంచు మాఇంటికి ఎలా వచ్చిన దమ్మా? మేము మీ యింటికి వచ్చినామా మీరు మా ఇంటికి వచ్చినారా! కాబట్టి ఆ కంచము మాదే అన్నారట. అలాకాదు మా యింటిలో కూడా కంచము అంచువున్నది. పట్టుకొని వస్తా నని రెండూ దగ్గరపెట్టి చూడగా రెండూ అతుక్కుపోయెను. మాది యని వారు పుచ్చుకున్నారట. సిగ్గుపడి, లజ్జపడి యింటికి వచ్చిన దట అపుడు కుమారుడు చూచి...

ఏమన్నారమ్మా అని అడుగగా మాదే అని వారే పుచ్చుకొన్నా రని చెప్పెను అపుడు కుమారుడు ఇపుడు రామదేవుని కథను చెబుతాను వింటావామ్మా అని అడిగెను. నేను కథ వినను కార్యమూ వినను ఏ పనీపాటో చేసుకుని బ్రతుకుతా గాని రామ దేవుని కథమాత్రము విననన్నది. ఎలా వచ్చిన ఐశ్వర్యం అలాగే వెళ్ళిపోయినది. నీ చెల్లిల్ని మాత్రం తీసుకుని వెడలి ఎవరికైనా యిచ్చి పెండ్లిచేయమని చెప్పెను. ఆమె ఆజ్ఞ ప్రకారంగా నారా యణభట్టు ప్రయాణమయినాడు. వారు ఊరు చివరికి వెళ్ళుసరికి కాశీకి వెడలిన నాగంభట్టు తిరుగు ప్రయాణమయి ధనము మూటగట్టుకొని వస్తున్నాడట. కొంతదూరం వచ్చేసరికి ఆయన ఊరు చివరకు వచ్చినారు అక్కడ కోనేరు కనిపించినది. ఆ కోనేరులో కాళ్ళు కడుగుచుండగా ఎక్కడనుంచో ఒకపెద్ద గరుడ పక్షి వచ్చి ఆ డబ్బు మూటను ఎత్తుకుపోయెను.

అయ్యో! అని నాగంభట్టు విచారిస్తూ ఇంటికి వస్తుండగా కొంతదూరం వచ్చే సరికి నారాయణమ్మను, నారాయణభట్టును చూచి అబ్బాయీ, అమ్మాయీ! మీరు సుఖంగా ఉన్నారా అని యడిగెను! ఏమున్నది నాన్నగారూ! యధాప్రకారమునకు ఏమిలోటులేదు. మీరు వెళ్ళి నది మొదలు కథ చెబుతాను వినమంటే అమ్మవినలేదు. కాబట్టి రామదేవునికి కోపంవచ్చి ఎలా వచ్చిన ఐశ్వర్యం అలాగే వెడలి పోయినది. అని జరిగినదంతా తండ్రికి చెప్పెను. ఆమె ఆజ్ఞ ప్రకారము వెంటబెట్టుకొని వస్తున్నాను. మీ ఆజ్ఞ యేమిటి నాన్న గారూ! సరే అలాగే చేయమనిచెప్పి నాగంభట్టు విచారిస్తూ యింటికి వెడలినాడు. నారాయణభట్టు నారాయణమ్మను వెంట నిడుకొని వెళ్ళుచుండెను. వెళ్ళగా వెళ్ళగా కొంతదూరము వెళ్ళే సరికి నారాయణభట్టుకు ఒక బ్రాహ్మణుడు కనిపించెను. ఓ బ్రాహ్మణుడా! నీకు నా చెల్లిల్నిచ్చి పెండ్లిచేస్తాను. చేసుకుంటావా? అని అడిగెను. నాకు పెండ్లివద్దు పేరంటమూ అక్కరలేదని చెప్పెను మరల కొంతదూరము పోయేసరికి యింకొక బ్రాహ్మ ణుడు కనిపించాడు. నారాయణభట్టు అతడితో ఓ బ్రాహ్మణుడా! నా చెల్లిల్నిచ్చి పెండ్లిచేస్తాను చేసుకుంటావా? అనడిగెను. నాకు పెండ్లివద్దు. పేరంటమూవద్దు యిదివరకే యిద్దరు భార్యలున్నారు అనెను. మరల వెళ్ళుచుండగా త్రోవలో ఒక పెద్ద పూలతోట కనిపించినది. ఆ తోటలో అన్నాచెల్లెలు కూర్చుని రామదేవుని కథ చెప్పుకుంటూ వుండగా ఎక్కడనుండో ఒక బ్రాహ్మణ యువ కుడు వచ్చి పూలు కోసుకుంటుండగా ఆ యువకుని చూచి ఓ బ్రాహ్మణుడా! నీకు నా చెల్లిల్నిచ్చి పెండ్లి చేస్తాను. చేసుకుంటావా అనెను. పెండ్లిజేస్తానంటే వద్దంటానా ! కాని మా గురువు గారు న్నారు. వారి ఆజ్ఞ ప్రకారము ఆయన పెళ్ళిచేసుకోమంటే జేసుకుంటాను అనెను. మీ గురువు గారుఎక్కడున్నారని అడుగగా ఫలానాతోటలో వున్నారని చెప్పెను. వెంటనే నారాయణభట్టు గురువుగారి దగ్గరకు వెడలి అయ్యా! గురువుగారూ! మీ శిష్యుడికి నా సోదరినిచ్చి పెండ్లిచేస్తాను తమరు ఒప్పుకుంటారా? అంతట గురువు బ్రహ్మచారి గృహస్తునిగా జేస్తా నంటే వద్దంటానా? కాని వాడి దగ్గర చింతాకంత బంగారంలేదు. గోపాదమంత భూమిలేదు. మీ కిష్టమయితే చెయ్యండి. కష్ట మయితే మానండి అని పలికెను. అపుడు నారాయణభట్టు గురువు గారికి దండంపెట్టి అలాగెక్కడికోవెళ్ళి

నాలుగురాటలు తెచ్చి పందిరివేసి గుచ్చిన ముత్యాలుతోరణాలుకట్టి,గుచ్చని ముత్యాలు తలంబ్రాలు పోసి డెబ్బది యాగాల నారాయణమ్మనిచ్చి పెండ్లి చేశాడు. వారక్కడనే కూర్చునికథ చెప్పుకున్నారట. అలాకొన్నాళ్ళ య్యేసరికి ఒక విప్రుడువచ్చి మీకు నాలుగు ఎకరముల భూమి ధారపోస్తాను. పుచ్చుకో వలసిందని చెప్పగా అపుడు వారు మేము రామదేవుని కథ చెప్పుకొను చున్నాము కథ అయితే పుచ్చుకుంటాం మీ కిష్టమయితే కూర్చునికథ వినండి అన్నారు. కథ అయిన తరువాత ఆ బ్రాహ్మణుడు రాగిచెంబులో నీరుపోసి ఫలానాతోటలో ఆస్తివున్నది. అనుభవించమని నాలుగు ఎకరాలభూమి వారికి ధారపోసి ఆ విప్రుడు ఎక్కడికో వెడలిపోయెను. ఆ నాలుగు ఎకరముల భూమి అనుభవించుచూ కథ చెప్పుకుంటూ అక్కడనే యున్నారు. అలా కొన్నాళ్ళయ్యేసరికి ఆ ఊరి రాజుగారు ఒక భవనం కట్టించి కొంత ధనం పుణ్యదంపతులకు ధారపోయాలని చూస్తున్నారట. యెక్కడ వెదకినా సరైన పుణ్యదంపతులు దొరకలేదు. ఆ రాత్రి రామ దేవుడు రాజుకలలో కనిపించి ఫలానా తోటలో పుణ్యదంపతులున్నారు. వారిని తీసుకు వచ్చి ధార పొయ్యండని ఆజ్ఞాపించి నారట వారి ఆజ్ఞ ప్రకారం మరునాడు దయమునలేచి పదహారు మందిబోయిలను, పల్లకిని పంపిరి. వారక్కడకు వెడలి ఏమండోయ్ మాదేశపు రాజుగారు ఒక గృహము కొంతభాగము మీ ఇద్దరికి ధారపోస్తారట మిమ్మల్ని వెంటబెట్టుకొని రమ్మని పంపిరి. కావున రావలసిందనిరి. మేము రామదేవునికథ చెప్పుకొనుచుంటిమి. మీకిష్టమయితే కూర్చుని కథ వినండి అనగా బోయిలు కథ విన్న తరువాత ఆ పుణ్యదంప తులనుతీసుకొని వెడలిరాజుగారికి అప్పగించిరి. రాజు సంతోష ముతో ఆ గృహము ధనమువారికి ధారపోసి వెళ్ళిపోయిరి. అపుడు నారాయణమ్మ, నారాయణభట్టు, ఆమెభర్త అక్కడ కూర్చుని ఆ గృహము, ఆ ధనము నాలుగు ఎకరముల భూమి అనుభవిస్తూ అక్కడ కథ చెప్పుకొనుచుండిరి. కొన్ని దినములయ్యేసరికి నారా యణభట్టు “అమ్మాయి! నేనెన్ని దినములు ఇలా ఉండనూ? కాబట్టి నేవెళ్ళి రామదేవుని తీసుకొని వస్తాను. నీవూ నీ భర్తా కథని మానకుండా చెప్పుకోండి. అని చెప్పి నారాయణభట్టు ప్రయాణమయి వెడలెనట నారాయణమ్మ ఆమెభర్త కథ చెప్పుకొను చుండిరి. నారాయణభట్టు కొంతదూరం వెళ్ళగా ఒకగ్రామము వచ్చినది. ఆ గ్రామములో ఒక గొల్లవాడు వడ్లు ఎండబోసుకుని కాపలా కూర్చుండెనట ఆ గొల్లవాడిని

చూచి గొల్లా ఈ గ్రామము లోని విశేషాలేమిటి? అనడిగెను. ఏమున్నది బాబూ నేనుపుట్టుక తోనే అంధుడను, మావాళ్ళు వడ్లు ఎండబోసి నన్ను కాపలా కూర్చోమనగా కర్రపుచ్చుకొని కూర్చుంటిని. నా యవస్థ యిలా వుంది బాబూ అనెనట నారాయణభట్టు ఒక కథ చెబుతాను వినెదవాయని అడిగెను. అలాగే వింటాను చెప్పమనెను. రామ దేవుని కథ వ్రత విధానమునుచెప్పే సరికి, గొల్లవానికి కొంచెము కళ్ళు కనిపించెనట. ఓహో కథలోనే యింత మహోత్మ్యమువుంది వ్రతము చేసుకుంటే యింకెంత మహోత్మ్యముంటుందో, ఏదైవా నివో ఏదేవుడవో చెప్పమనెను. అది రామదేవుని మహోత్మ్యము ఐదు లక్ష్మివారములు పూజచేసి ఆవు నేతితో దీపం పెట్టవలెను. ప్రసాదము అయిదు వుండులుచేసి రామదేవుని ముత్తయిదువు లకు, బ్రాహ్మణులకు,యిరుగు పొరుగువారికి యిచ్చి భార్య, పిల్లలు తినవలెను అని వెడలి పోయెను. తిరిగి కొంత దూరము వెళ్ళేసరికి ఒకరాజు విచారిస్తూ వుండెను. ఆ రాజునుచూచి ఏమి రాజా! విచారిస్తూన్నారు అనడిగెను. నాయనా! నా భార్యా బిడ్డలు పరారైనారు. నా రాజ్యము పరాయి రాజులు తీసుకొనిరి. నా అవస్థ యిలా వున్నది బాబూ అని చెప్పెను. నేనోకథ చెబు తాను వింటావా! యని యడిగెను. అలాగే వింటాను చెప్పవలసింది మహానుభావా యనెను.

నారాయణభట్టు రామదేవుని కథ అంతా చెప్పి వ్రత విధాన మంతా వివరించెను. ఆ రాజుగారు వ్రతం చేసుకొనగా పరారైన భార్యాబిడ్డలు పరాయిరాజు తీసుకున్న రాజ్యము తిరిగి ప్రాప్తిం చెను. అప్పుడు రాజు సంతోషముతో నారాయణభట్టును చూచి ఏమండి మహానుభావా ! మీరు ఏదేవుడో చెప్పవలసినది మిమ్మల్ని పూజచేసుకుంటాము. “నేను ఏ దేవుడనుకాను ఇది రామదేవుని కథ మహోత్మ్యముమీరు అయిదు లక్ష్మివారములు ఐదు ఆదివార ములు పూజచేయమని చెప్పి వ్రత విధనమంతా చెప్పి మరల కొంత దూరం వెళ్ళగా ఓస్త్రీ విచారిస్తూ కూర్చున్నది ఆస్త్రీని చూచి నారాయణభట్టు ఎందుకు విచారిస్తున్నావు? అని అడిగెను. అప్పు డామె ఏముంది బాబూ! చిన్నతనంలోనే పెండ్లి అయింది నా భర్త దేశాంతరం వెడలినాడు. నా తల్లి, తండ్రి, అత్తమామలు కొన్నాళ్ళు చూచి ఎన్నాళ్ళు నిన్ను ఇలాగున చూస్తాము, అని వదలివేశారు. కాబట్టి నా అవస్థ ఇలాగున్నది బాబూ అనిచెప్పినది. అప్పుడు నేనొక కథచెపుతాను

వింటావా అనెను అలాగే వింటాను బాబూ చెప్పమన్నది. నారాయణభట్టు రామదేవుని కథంతా చెప్పి వ్రతవిధానమంతా చెప్పేసరికి దేశాంతరము వెడలిన ఆమెభర్త తిరిగి వచ్చాడు. తల్లితండ్రి అత్తమామలు వచ్చారు. ఆమె సంతోషించి నారాయణభట్టును చూచి ఏమండీ మహానుభావా మీరు ఏ దైవానివో? మిమ్ములను మేము పూజచేసుకుంటాము చెప్పమని యడిగెను. యిదంతా రామదేవునికథ మాహాత్మ్యము అయిదు లక్ష్మివారములు అయిదు ఆదివారములు మానకుండా పూజచేయ మని కథవిధానమంతా చెప్పి కొంతదూరము వెళ్ళుసరికి ఒక గ్రామము వచ్చినది. ఆ గ్రామములో ఒక యిల్లాలి యింటికివెళ్ళి అమ్మా పూజచేసుకుం టాను కొంచెం యిల్లు యిస్తావా అని అడి గెను, మా యింటిలో మడి ఆచారం గనుక కుదరదు యిల్లులేదు వెడలిపొండు అన్నది. అపుడు నారాయణభట్టు కోనేరయినా చూపించు తల్లీ! అని యడిగెను. తూర్పుదిశ ఈశాన్య మూలగా ఒక కోనేరున్నది. వెళ్ళమని చెప్పెను. యపుడు ఆ కోనేరు దగ్గరకు వెడలిస్నానముచేసి మడిబట్ట ఆరవేసుకుని యిల్లు యివ్వనన్న యిల్లాలి యరుగువద్దకు వచ్చి తూర్పుదిశ ఈశాన్యమూలగా ఒక పుచ్చుపీటకు పసపురాసి బొట్టుపెట్టి యందు రామదేవుని పటము పెట్టి కథ చదువుకొనుచున్నాడట యంతలో ఆమె ఇవతలకు వచ్చిచూడగా నారాయణభట్టు ఆమెకు తాంబూలము దక్షిణ ప్రసాదం యిచ్చాడట ఆమె పుచ్చుకొని లోపలికి  వెడలి పోయెను.

నారాయణభట్టు కథ చదువుకొని అక్షతలు తలమీద వేసుకుని యింటిమీద వేసి వెళ్ళిపోయెను. అతడు యిలా వెళ్లగానే ఆఇల్లు ఇంద్రభవనమయినది అపుడు ఆయవారమునకు వెళ్ళిన తన భర్త తిరిగివస్తే ఆ యిల్లు తెలుసుకోలేడని ఆమె వీధి అరుగుమీద కావలి కూర్చుని యుండెను.ఇంతలో ఆమె భర్త యెడమూట పెడమూట వేసుకొని యిల్లు కానక కంగారుపడి అక్కడ నిలబడి యుండెను. ఆమెచూచి యిల్లు యిదే యిలారండి యిది మన యిల్లుకాదు. నేను రానని పలుకగా యిది మనిల్లే యిలా యెందు కయినదో చెబుతాను వినండి. ఎక్కడనుండో ఒక బ్రాహ్మణుడు వచ్చి పూజచేసుకుంటాను యిల్లు యివ్వమని చెప్పితిని. అప్పు డతను ఒక కోనేరయినా చూపించమనెను. అపుడు నేను తూర్పు దిశగా ఈశాన్యమూల కోనేరున్నదని చెప్పితిని యతడు కోనేరు దగ్గరకు పోయి

స్నానంచేసి మడిబట్ట యారవేసుకుని మన అరుగు మీదకు వచ్చి ఒక పీటకు పసుపు వ్రాసి బొట్లుపెట్టి తూర్పుదిశ ఈశాన్య మూలగా పెట్టియందు రామదేవుని పటము పెట్టి పూజచేసి యావుపాలు గోధుమనూక పంచదార కలిపి ప్రసాదముగా ఉండలుచేసి రామదేవునికి నైవేద్యము పెట్టి కథ చెప్పుకొను చుండెను. నేను బయటకు వచ్చేసరికి తాంబూలాది దక్షిణ, ప్రసాదములు నాకు యిచ్చినాడు. నేనులోనికి వెళ్ళిపోయి తిని, యతడు కొన్ని అక్షతలు తలమీద వేసుకుని, మరికొన్ని అక్షతలు మన యింటిమీద వేసి వెళ్ళిపోగా యిల్లు యిలా ఇంద్ర భవనముగా మారినది. ఇదంతా ప్రసాదమాహాత్మ్యము యనీ పలికెను. ఆయన పూజచేసుకుంటా నంటే వద్దన్నావా?నిర్భాగ్యు రాలా! పాపిష్టిదానా అతడు ఏ దిశగా వెళ్ళేడు చెప్పు అనగా ఈశాన్యమూలగా వెళ్ళినాడని చెప్పింది. అపుడు ఆయన మాటలు అక్కడపెట్టి నారాయణభట్టును వెదకుతూ బయలుదేరెను. కొంత దూరం వెళ్ళగా నారాయణభట్టు ఆ బ్రాహ్మణునకు కనిపించెను. అపుడా బ్రాహ్మణుడు ఏమండోయ్ మహానుభావా! మీరు మా యింటికి రావలసింది. మిమ్ము పూజించుకుంటాం అనెను. "మీ యింటికిఇపుడు రానురామదేవుని వెదకుటకు వెళ్ళు చున్నాను. అనెను అపుడా బ్రాహ్మణుడు అలాకాదు మహాను భావా! మీరు మా యింటికి వచ్చి పూజచేసుకుంటానంటే మా వాళ్లు యిల్లు యివ్వనన్నారు. కాబట్టి మాదే తప్పు మాతప్పు క్షమించి మా యింటికి రావలసినది మీరు ఏదైవానివో చెప్పండి. మిమ్ము మేము పూజించు కుంటామనెను. మీ యిల్లు కాబట్టి మీరు ఇవ్వనన్నారు. మీ తప్పేమీ లేదు. రావడం నాదే తప్పు అనెను. నేను యే దేవుడను కానుయిదంతా రామదేవునికథ మహత్మ్యం నీవు యింటికి వెడలి ఐదు లక్ష్మివారములు ఐదు ఆదివారములు పూజచేసుకోమని వ్రత విధానమంతా చెప్పెను. రామదేవుని వెదక్కొని వచ్చేటప్పుడు నీ యింటికి వస్తాను అనెను. అపుడా బ్రాహ్మణుడి యింటికివచ్చి కథలోనే యింత మాహాత్మ్యం వుంది వ్రతం చేసుకుంటే యింకెంత మాహాత్మ్యం వుంటుందోనని పూజచేసుకొని కథ చెప్పుకొని అష్ట ఐశ్వర్యములతో అష్ట సంపద లతో తులతూగుచున్నారట. నారాయణభట్టు ఎండనక వాననక, తిండనక, తిప్పలనక, ఆకలనక, దప్పికనక, చెట్టనక, పుట్టనక, నీడనక, భయమనక, అర్థరాత్రనక అరణ్యాలంటబడి వెళ్ళుచుం డగా కొంతదూరము వెళ్ళేసరికి నారాయణభట్టు మూర్ఛిల్లి ముఖము తిరిగి పడిపోయెను. అపుడు

రామదేవునకు దయకలిగి ముసలి బ్రాహ్మణ వేషముతో వచ్చి నారాయణ భట్టు ముఖము తుడిచి లేవదీసి మంచినీళ్ళు యిచ్చి మా ఇంటిలో భోజనము చేద్దువుగాని రమ్మనెను. నేను భోజనము మాత్రం చేయను నేను రామదేవుని వెదకుటకు వెళ్ళుచున్నాను. ఒక కోనేరు మాత్రం చూపించిన స్నానము చేస్తానన్నాడట. తూర్పుదిశ ఈశాన్యమూల ఒక కోనేరున్నది. వెళ్ళమన్నాడట. నారాయణ భట్టు ఆ కోనేరు వద్దకు వెడలి స్నానంచేసి పైకి వచ్చేసరికి అక్కడ ఇంద్ర భవనంలామారిపోయెను. లోపలకు వచ్చేసరికి సీతమ్మవారు వెండి కంచాలు, వెండిపీటలు, పైడి కంచాలు కనిపించినవి అపుడు నారాయణ భట్టుకు రామదేవుడు సీతమ్మ ఎదురయి మా ఇంటిలో భోజనము చేయుదురుగాని రమ్మన్నారట నేను భోజనము మాత్రం చేయను, రామదేవుని వెదకుటకు వెళ్ళుచున్నాను అన్నాడట, నేను రామదేవున్ని అనిచెప్పెను అయితే కావచ్చును మహానుభావా! నాకు దర్శనం కావాలి అని చెప్పగా అపుడు పులి చర్మముతో రుద్రాక్షలతో విభూతిరేఖలతో నడుమున నాగాభరణముతో శిరస్సున గంగతో ప్రక్కన పార్వతీదేవితో త్రిశూలం. త్రినేత్రముతో నందివాహనుడై ఈశ్వరుడు ప్రత్యక్షమైనాడు. అపుడు నారాయణ భట్టు వారిని స్తోత్రము చేసెను.

## ఈశ్వర స్తుతి

వందే శంభు ముమాపతి సురగురుంవందే జగత్కారణం
వందేపన్నగ భూషణం మృగధరం వందే పశూనాంపతిమ్
వందేసూర్య శశాంక వహ్నినయనం వందేముకుందప్రియం
వందే భక్తజనాశ్రయంచ వరదం వందే శివం శంకరమ్

అని స్తోత్రము చేయగా ఈశ్వరుడు ప్రత్యక్షమైనాడు. అపుడు నారాయణ భట్టు విష్ణుమూర్తి కూడా ప్రత్యక్షం కావలయునని కోరెను. అపుడు విష్ణుమూర్తి వక్షఃస్థలంబున వనమాలికతో మెరుగుతీగవంటి లక్ష్మీదేవితో శంఖచక్రగధా ధరుడయి నెమలి ఫించము ధరించి ప్రత్యక్షమైనాడు. అపుడు హరినికూడా ఈ విధముగా స్తోత్రము చేసెను.

## విష్ణు స్తోత్రము

శాన్తాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాకారం గగన సదృశం మేఘవర్ణం శుభాంగం

లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృధ్యానగమ్యం
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైక నాథమ్

అని స్తోత్రము చేయగా విష్ణుమూర్తి ప్రత్యక్షమైనాడు అపుడు నారాయణ భట్టు రామదేవుడు ప్రత్యక్షమవ్వాలనెను.

## శ్రీరామ స్తుతి

శ్రీమద్దివ్య మనీంద్ర చిత్తనిలయం సీతా మనోనాయకం
వాల్మీకోద్భ వాక్పయోధిశశినం స్మేరాననం విస్మయం
నిత్యం నీరద నీలకాయ కమలం నిర్వాణ సంధాయకం
శాంతం నిత్యమనామయం శివకరం శ్రీరామచంద్రం భజే

అని స్తోత్రం చేసేసరికి హనుమ సీతారామలక్ష్మణ భరత శతృఘ్నులు సపరివార సహితముగా శ్రీరామచంద్రుడు ప్రత్యక్షమై నాడు. అపుడు రామదేవుడు యిప్పుడయినా భోజనం చేస్తావా! అని నారాయణభట్టు నడిగెను. అలాగే చేస్తాగాని భోజనమయిన తరువాత నాతో వస్తానని అభయహస్తమిస్తే భోజనం చేస్తాననెను. అపుడా సీతమ్మతల్లి నాలుగు కూరలు, నవకాయ పిండివంటలతో పంచభక్ష్య పరమాన్నాలు వండి వెండికంచాలు పైడి పీటలువేసి వారి బంధుకోటి పరివార సహితముగా నారాయణభట్టుకు సీత మహాతల్లి భోజనం వడ్డించెను. అందరూ భోజనములు చేసి, లేచి కర్పూర తాంబూలము వేసుకొన్న తర్వాత నాతో వస్తానని అభయ హస్త మిచ్చావు. కావున మా యింటికి నాతో రావలసినదని కోరెను. అపుడు నారాయణభట్టు ముందు రామదేవుడు వెనుక తాను బయలుదేరి వెళ్లుచున్నారు. అలా కొంతదూరం వెడలి నారాయణభట్టు వెనుకకు తిరిగి చూచెను. అపుడా రామదేవుడు కనిపించలేదు. అంత నారాయణభట్టు ముఖము తిరిగి మూర్ఛవచ్చి నేలమీద పడిపోయెను. అపుడు రామ దేవునకు దయకలిగి ఒక ముసలి బ్రాహ్మణ వేషములో వచ్చి నారాయణభట్టు ముఖము తుడిచి లేవదీసి, మంచినీళ్ళు ఇచ్చి యేమి యిలాగున పడిపోయి నావు నాతో నడువలేనివాడవు నన్ను ఎందుకు రమ్మన్నావు? అని అడిగెను. దేవా నీ మహిమను బ్రహ్మాది దేవతలు, యోగీశ్వ రులు, మునీశ్వరులు, తపస్యులు తెలుసుకోలేరు. మీ మాహాత్మ్యం తెలుసు కొనుటకు నేనెంత వాడను? నా తప్పులు క్షమించి నాతో రావలసినదని రామదేవుని నారాయణభట్టు ప్రార్ధించెను. అపుడు రామదేవుడు అలాగే

వస్తానని నీవు వచ్చునపుడు యెవరి యిళ్ళకు వెళ్ళినావో వారి యిళ్ళకు నన్ను కూడా నీ భుజాలపై నెక్కించుకొని తీసుకెళ్ళమనెను. అపుడు నారాయణభట్టు రామదేవుడ్ని భుజాలపై ఎక్కించుకొని కొంత దూరం వచ్చుసరికి యిల్లు యివ్వనని చెప్పిన యిల్లాలి యింటికి వచ్చిరి. అచట ఆ యిల్లాలు ఆమె భర్త కూర్చొని రామదేవుని కథ చెప్పుకొనుచున్నారు. వారి భక్తికి మెచ్చి వారికి అష్టఐశ్వర్యములు, ఆయురారోగ్యములు ఇచ్చి కాపాడి రక్షించెను. మరికొంతదూరము వచ్చేసరికి స్త్రీయిల్లువచ్చెను. అచ్చుట వచ్చు సరికి స్త్రీ ఆమె భర్త కూర్చుని కథ చెప్పు కొనుచున్నారు. వారికి ఐశ్వర్యములు, ఆయురారోగ్యములు యిచ్చి సిరిసంపదలు ఎడబాయకుండా యిచ్చి వారిని రక్షించాడట. మరికొంత దూరము వచ్చేసరికి గొల్లయిల్లు వచ్చెను. ఆరోజు ఆదివారము నారాయణభట్టు చెప్పిన మాదిరి పూజచేసుకుని కథ చెప్పుకొను చున్నారు. వారిని మెచ్చి ఐశ్వర్యములు ఆయు రారోగ్యములు నిచ్చి సిరిసంప దలు నెడబాయకుండా వారిని కాపాడి రక్షించినారట. యింకా కొంత దూరము వచ్చుసరికి చెల్లెలి యిల్లొచ్చినది. అక్కడవారు రామదేవుని కథ చెప్పుకొనుచు బంగారపు తూగుటుయ్యాలలో ఊగుచున్నారు. వారిని మెచ్చి ఆయురారోగ్యములు యిచ్చి సిరిసంపదలు కాపాడి రక్షించినారట. అపుడు నారాయణమ్మ తమ యింటికి అన్నయ్య వచ్చినాడని కాళ్ళుకడుగు కొనుటకు నీళ్ళిచ్చి దాహానికి మజ్జిగయిచ్చి మర్యాదచేసినది. అపుడు నారాయణభట్టు అమ్మాయి నన్నిలా మర్యాద చేయనక్కరలేదు. నేను రామదేవుని తీసుకువచ్చు చుంటిని నీవు నీభర్త మాయింటికి రావలెను. మన మందరము పూజచేసు కుందాము అని చెప్పెను. అప్పుడామె సంతోషముతో అలాగే వస్తాననెను. నారాయణమ్మ ఆమె భర్తతో నారాయణభట్టు రామదేవునితో సహావారందరూ బయలుదేరి వారి గ్రామము పొలిమేర కొచ్చేసరికి గ్రామంలోని వారు కొందరుచూసి పరుగునబోయి వారి తల్లిదండ్రులతో ఏమండోయ్ నాగంభట్టు గారూ! మీఅబ్బాయీ అమ్మాయీ అల్లుడు యింకా ఎవరెవరో బయలుదేరి వచ్చుచున్నారు. అని పరుగు పరుగున వెడలి చెప్పిరి. అపుడు నారాయణభట్టు తల్లిదండ్రులు పరుగునవచ్చి సంతోషముతో కుమారుని, కుమార్తెను కౌగిలించుకోబోయినారట. అపుడు నారాయణభట్టు చూచి అమ్మా నన్ను ముట్టుకోవద్దు. ఇపుడు నేను రామదేవుని తీసుకొని వచ్చుచున్నాను. మీరు మా యింటికి వెళ్ళి నాలుగుమూలలు దులిపి నల్లగ అలికి తెల్లగ ముగ్గుపెట్టి పచ్చగ పసుపురాసి మామిడాకుల తోరణాలు

కట్టి ఒక పీటకు పసుపురాసి బొట్టుపెట్టి తూర్పుదిశ, ఈశాన్యమూలగ ఉంచి రామదేవుని పటముపెట్టి గోధుమనూక, పంచదార,ఆవుపాలు కలిపి ప్రసాదం అయిదువుండలుచేసి పూజకుఅన్నీ సిద్ధంచేసి నాకు కబురు చెయ్యండి. అపుడు నేనురామదేవుని తీసుకొని వచ్చెదనని చెప్పెను. వారు సంతోషమున యింటికి వచ్చి నాలుగు మూలల దులిపి, అలికి ముగ్గులు పెట్టి, పచ్చగా పసుపురాసి, మామిడాకులు తోరణాలుకట్టి, నాలుగుమూలల వెదకగా ఒకపుచ్చు పీట కనిపించింది. ఆ పీటకు పసుపురాసి బొట్టుపెట్టికుమారుడు చెప్పిన ప్రకారంగా సిద్ధపరి చాడు. నీవు రామదేవుని తీసుకురమ్మని కుమారునికి కబురు పంపెను. అపుడు నారాయణభట్టు సంతోషముతో రామదేవుని భుజములపై ఎక్కించు కొని ఆ గ్రామం నాలుగు వీధులు ఊరేగించి ఇంటికి తీసుకువచ్చి రామదేవు నితో తండ్రీ! మా ఇంటిలో మీరు కుడి పాదము పెట్టవలెనని ప్రార్ధించెను. అపుడు రామ దేవుడు వారి ఇంటిలో కుడిపాదము పెట్టేసరికి పెద్ద ఇంద్రభవనముగా మారి పోయినది. అపుడు నారాయణభట్టు రామదేవునితో అనెను అపరాధిని కాబట్టి నాకు వున్న ఈపుచ్చు పీటయే సింహాసనమనుకొని దయయుంచి తమరు కూర్చుండవలసినదని వినయంగా ప్రార్ధిం చెను. ఆ మాట రామదేవునకు జాలి కలిగి ఆ పీటమీద కూర్చుండే సరికి అది వజ్రాలు, వైఢూర్యాలు, కెంపులు, మాణిక్యాలతో చేసిన బంగారపు సింహాస నంగా మారిందట. అందు హనుమసీత లక్ష్మణ భరత శతృఘ్నాది సపరివార సహితముగా శ్రీరామచంద్రమూర్తి తన ఇంటిలో ఆసీనులై వెలసినారట. అపుడు రామదేవునివ్రతం చేసుకుందాం అనేసరికి అంతలోనే ఎక్కడ నుండో ఒక బీదబ్రాహ్మణుడు వచ్చి ఏమండోయ్ నాగంభట్టుగారూ! మీ అబ్బాయికి మా అమ్మాయినిచ్చి పెళ్ళిజేస్తాం ఒప్పుకుంటారా అని అడగగా పెళ్ళి జేస్తానంటే వద్దంటానా బాబూ! అలాగే జేసుకుంటాము అనెను. నాగంభట్టు గారు పచ్చని పందిరిలు వేయించి, గుచ్చిన ముత్యాలు తోరణాలు కట్టి, గుచ్చని ముత్యాలు తలంబ్రాలుపోసి, డబ్బై యాగాల నారాయణభట్టు పెళ్ళి జేసెను. నారాయణభట్టు పెళ్ళైన తరువాత నాగంభట్టుభార్య, నారాయణ భట్టుభార్య, నారాయణమ్మ, ఆమెభర్త వారంతా రామదేవుని వ్రతముచేసి అయిదు లక్ష్మివారములు అయిదు ఆదివారములు పూజచేసి నైవేద్యము పెట్టి కథమాన కుండా చెప్పుకొంటున్నారట వారి భక్తికిమెచ్చి రక్షించినాడు. ఈనోము ప్రపంచమంతా నోచిన వారందరూ అష్ట ఐశ్వర్యవంతులై సుఖముగా నుండిరి.

# శ్రీ నామ రామాయణము

**బాలకాండము**

ప॥ శుద్ధబ్రహ్మపరాత్పర రామ!
కాలాత్మకపరమేశ్వర రామ!

**1.** శేషతల్పసుఖనిద్రిత రామ!
**2.** బ్రహ్మాద్యమరప్రార్థిత రామ!
**3.** భక్తబృంద పరిపాలన రామ!
**4.** ముక్తిప్రద సురమునినుత రామ
**5.** చండకిరణకులమండన రామ!
**6.** శ్రీమద్దశరథనందన రామ!
**7.** కౌసల్యాసుఖవర్ధన రామ!
**8.** విశ్వామిత్రప్రియధన రామ!
**9.** ఘోరతాటకాఘాతుక రామ !
**10.** మారీచాదినిపాతక రామ !
**11.** కౌశికమఖసంరక్షఖ రామ !
**12.** శ్రీమదహల్యోద్ధారక రామ !
**13.** గౌతమమునిసంపూజిత రామ !
**14.** సురమునివరగణసంస్తుత రామ !
**15.** నావికధావితమృదుపదరామ!
**16.** మిథిలాపురజనమోదక రామ !
**17.** విదేహమానసరంజక రామ !
**18.** త్ర్యంబకకార్ముకభంజక రామ !
**19.** సీతార్పితవరమాలిక రామ !
**20.** కృతవైవాహికకౌతుక రామ !
**21.** భార్గవ దర్పవినాశక రామ !
**22.** శ్రీమదయోధ్యాపాలక రామ !

**అయోధ్యా కాండము**

**23.** అగణితగుణగణభూషిత రామ !
**24.** అవనీతనయాకామిత రామ !
**25.** రాకాచంద్రసమానన రామ !
**26.** పితృవాక్యాశ్రితకానన రామ !
**27.** పియగుహవినివేదితపద రామ !
**28.** తత్క్షాళితనిజమృదుపద రామ !
**29.** భరద్వాజముఖానందక రామ !
**30.** చిత్రకూటాద్రినికేతన రామ !
**31.** దశరథసంతతచింతత రామ !
**32.** కైకేయితనయార్థిత రామ !
**33.** విరచితనిజపితృకర్మక రామ !
**34.** భరతార్పిత నిజపాదుక రామ !

**అరణ్య కాండము**

**35.** దండకవనజనపావన రామ !
**36.** దుష్టవిరాధవినాశన రామ !
**37.** శరభంగసుతీక్ష్ణార్చిత రామ !
**38.** దుష్టవిరాధవినాశన రామ !
**39.** గృధ్రాధిపసంసేవిత రామ !
**40.** పంచవటీతటసుస్థిత రామ !
**41.** శూర్పణఖార్తివిధాయక రామ !
**42.** ఖరదూషణముఖసూదక రామ !
**43.** సీతాప్రియహరిణానుగ రామ !
**44.** మారీచార్తికృదాశుగ రామ !
**45.** వినష్టసీతాన్వేషక రామ !
**46.** గృధ్రాధిపగతిదాయక రామ !
**47.** శబరీదత్తఫలాశన రామ !
**48.** కబంధబాహుచ్ఛేదన రామ !

**కిష్కింధా కాండము**

**49.** హనుమత్సేవితనిజపద రామ !
**50.** నతసుగ్రీవాభీష్టద రామ !
**51.** గర్వితవాలిసంహారక రామ !
**52.** వానరదూతప్రేషక రామ !
**53.** హితకరలక్ష్మణసంయుత రామ !
**54.** సమస్తలోకాధారక రామ!

**సుందరకాండము**

**55.** కపివరసంతతసంస్మృత రామ !

**56.** తద్గతివిఘ్నధ్వంసక రామ !
**57.** సీతాప్రాణాధారక రామ !
**58.** దుష్టదశాననదూషిత రామ !
**59.** శిష్టహనూమద్భూషిత రామ !
**60.** సీతావేదితకాకావన(కాకప)రామ !
**61.** కృతచూడామణిదర్శన రామ !
**62.** కపివరవచనాశ్వాసిత రామ !

### యుద్ధ కాండము

**63.** రావణనిధన ప్రస్థిత రామ !
**64.** వానరసైన్యసమావృత రామ !
**65.** శోషితసరిదీశార్థిత రామ !
**66.** విభీషణాభయదాయక రామ !
**67.** పర్వతసేతునిబంధక రామ !
**68.** కుంభకర్ణశిరశ్ఛేదక రామ !
**69.** రాక్షససంఘవిమర్దక రామ !
**70.** అహిమహిరావణమారణ రామ !
**71.** సంహృతదశముఖరావణ రామ !
**72.** విధిభవముఖసురసంస్తుత రామ !
**73.** ఖస్థితదశరథవీక్షిత రామ !
**74.** సీతాదర్శనమోదిత రామ !
**75.** అభిషిక్తవిభీషణనుత రామ !
**76.** పుష్పకయానారోహణ రామ !
**77.** భరద్వాజాభినిషేవణ రామ !
**78.** భరతప్రాణప్రియకర రామ !
**79.** సాకేతపురీభూషణ రామ !
**80.** సమస్త జనసమ్మానిత రామ !
**81.** రత్నలసత్పీఠస్థిత రామ !
**82.** పట్టాభిషేకాలంకృత రామ !
**83.** పార్థివకులసమ్మానిత రామ !
**84.** విభీషణార్పితరంగక రామ !
**85.** కీశకులానుగ్రహకర రామ !
**86.** సకలజీవసంరక్షక రామ !

### ఉత్తర కాండము

**87.** అగతమునిగణసంస్తుత రామ !
**88.** విశ్రుతదశకంఠోద్భవ రామ !
**89.** సీతాలింగననిర్వృత రామ!
**90.** నీతిసురక్షితజనపద రామ !
**91.** విపనత్యాజితజనకజ రామ !
**92.** కారితలవణాసురవధ రామ !
**93.** స్వర్గతశంబుక సంస్తుత రామ !
**94.** స్వతనయకుశలవవందిత రామ !
**95.** అశ్వమేధక్రతుదీక్షిత రామ !
**96.** కాలావేదితసురపద రామ !
**97.** ఆయోధ్యకజనముక్తిద రామ !
**98.** విధిముఖవిబుధానందక రామ !
**99.** తేజోమయనిజరూపక రామ !
**100.** సంసృతిబంధవిమోచక రామ !
**101.** ధర్మస్థాపనతత్పర రామ !
**102.** భక్తిపరాయణముక్తిద రామ !
**103.** సర్వచరాచరపాలక రామ !
**104.** సర్వభవామయవారక రామ !
**105.** వైకుంఠాలయసంస్థిత రామ !
**106.** నిత్యానందపదస్థిత రామ !
**107.** రామరామ జయ రాజారామ !
**108.** రామ రామ జయ సీతారామ !
**109.** భయహర మంగళ దశరథరామ!
**110.** సంగతశుభవిభవోదయ రామ!
**111.** మంగళకర జయమంగళ రామ!
**112.** మంగళకర శుభమంగళరామ!
**113.** ఆనందామృతవర్షక రామ!
**114.** ఆశ్రితవత్సల జయజయ రామ!
**115.** రఘుపతిరాఘవ రాజారామ!
**116.** పతిత పావన సీతారామ !

హరిః ఓం తత్సత్

www.mohanpublications.com

# మోహన్ పబ్లికేషన్స్‌లో లభించు

# పుస్తకముల పట్టిక

## (Book List)

ఆధ్యాత్మిక, జ్యోతిష, వాస్తు, ఆయుర్వేద, మంత్రశాస్త్రాది
అనేక విషయాలు తెలుసుకోండి...

ఫేస్‌బుక్ **మోహన్ పబ్లికేషన్స్** పేజ్ లైక్ చేయండి.




Like us to follow :

**MOHAN PUBLICATIONS**

Rajamahendravaram

# మావద్ద లభించు గ్రంథములు

## 1. వ్రతకథలు - పూజలు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ వినాయక వ్రతం | వెల రూ.10-00 |
| 2. | శ్రీ విఘ్నేశ్వరపూజా-పుణ్యాహవాచనం | 30-00 |
| 3. | శ్రీ విఘ్నేశ్వరపూజ (కాణిపాకక్షేత్రమాహాత్మ్యంతో) | 10-00 |
| 4. | సంకష్టహరచతుర్థి శ్రీమహాగణపతి వ్రతం | 30-00 |
| 5. | వరలక్ష్మీ వ్రతం | 10-00 |
| 6. | కేదారేశ్వర వ్రతం | 10-00 |
| 7. | త్రినాధ వ్రతం(కలర్) | 10-00 |
| 8. | త్రినాధవ్రతం(సాదా) | 5-00 |
| 9. | క్షీరాబ్ధి వ్రతం | 12-00 |
| 10. | మంగళ గౌరీవ్రతం | 10-00 |
| 11. | వైభవలక్ష్మీ వ్రతం ఫోటో యంత్రంతో | 25-00 |
| 12. | శ్రీలక్ష్మీ కుబేర వ్రతం (ఫోటో యంత్రంతో) | 25-00 |
| 13. | కనకమహాలక్ష్మీ వ్రతం (కామేశ్వరీపాటతో) | 25-00 |
| 14. | సంతోషీమాతా వ్రతం | 25-00 |
| 15. | ఏడు శనివారాల వ్రతం | 25-00 |
| 16. | సత్యనారాయణవ్రతం | 25-00 |
| 17. | శ్రీ సువర్చలాహనుమద్దీక్ష | 30-00 |
| 18. | శివదీక్ష | 10-00 |
| 19. | కాత్యాయనీ వ్రతం | 20-00 |
| 20. | సౌభాగ్య గౌరీవ్రతం | 20-00 |
| 21. | తిరుప్పావై (ధనుర్మాసవ్రతం) | 36-00 |
| 22. | స్త్రీల వ్రతకథలు | 36-00 |
| 23. | స్త్రీలవ్రతకథలుస్థూలాక్షరి (నేదునూరిగంగాధరరావుగారి) | 54-00 |
| 24. | పెళ్ళి పాటలు - స్త్రీలపాటలు (కామేశ్వరిపాటతో) | 36-00 |
| 25. | సర్వదేవతా పూజావిధానం | 25-00 |
| 26. | ఆరువ్రతాలు | 30-00 |
| 27. | రాహుకాలంలోదుర్గాదేవీపూజా | 10-00 |

ఈ ధరలు నికరముకాదు, ఎప్పటికప్పుడు మారుచుండవచ్చును.

| | | |
|---|---|---|
| 28. | తులసి నిత్యపూజ, తులసీఉపయోగాలు | 10-00 |
| 29. | శ్రీ చక్ర రహస్య విజ్ఞానమ్ | 36-00 |
| 30. | శ్రీచక్ర పూజావిధానం(పెద్దది) | 36-00 |
| 31. | లక్ష్మి - గౌరీ నిత్యపూజ | 10-00 |
| 32. | శ్రీ సరస్వతీ నిత్యపూజ | 10-00 |
| 33. | శ్రీ దుర్గానిత్యపూజ | 10-00 |
| 34. | కాలభైరవ నిత్యపూజ | 10-00 |
| 35. | శివపూజ | 10-00 |
| 36. | వీరభద్ర పూజ | 10-00 |
| 37. | ఆంజనేయ నిత్యపూజ | 10-00 |
| 38. | నాగేంద్ర స్వామి పూజ | 10-00 |
| 39. | సుబ్రహ్మణ్య నిత్యపూజ | 10-00 |
| 40. | రామదేవుని కథ | 10-00 |
| 41. | శివదేవుని కథ | 10-00 |
| 42. | లక్ష్మీనరసింహపూజ | 10-00 |
| 43. | వేంకటేశ్వరపూజ | 10-00 |
| 44. | బ్రహ్మంగారి నిత్యపూజ | 10-00 |
| 45. | సూర్య నిత్యపూజ | 10-00 |
| 46. | నవగ్రహ నిత్యపూజ | 10-00 |
| 47. | రుక్మిణీ కల్యాణం | 25-00 |
| 48. | ఉమామహేశ్వర వ్రతం | 36-00 |
| 49. | శ్రీ కామేశ్వరీ వ్రతం | 36-00 |
| 50. | 16 సోమవారముల వ్రతము | 25-00 |
| 51. | పార్వతీకల్యాణం | 25-00 |
| 52. | సహస్రకమలవర్తి వ్రతము | 25-00 |
| 53. | పంచముఖ ఆంజనేయ పూజావిధానము | 36-00 |
| 54. | అష్టనాగపూజ | 36-00 |
| 55. | పూజలు ఎందుకుచేయాలి ? | 36-00 |
| 56. | ఏ దేవునికి ఏపుష్పాలతో పూజించాలి? | 36-00 |
| 57. | ఏ దేవునికి ఏప్రసాదం నైవేద్యం పెట్టాలి? | 36-00 |
| 58. | ఏదేవునికి ఏవిధముగాదీపారాధనచెయ్యాలి? | 36-00 |
| 59. | ఏదేవునికి ఎన్ని ప్రదక్షిణలుచేయాలి ? | 36-00 |
| 60. | హనుమద్ వ్రతం | 36-00 |
| 61. | పంచాయతన పూజ | 63-00 |
| 62. | 28 వ్రతములు | 120-00 |

| | | |
|---|---|---|
| 63. | కలశపూజలు (9ఒకేసారి) | 150-00 |
| 64. | కలశపూజలు (విడివిడిగా) (ప్రింటులో) | .... |
| 65. | హ్రీంకార మహాయజ్ఞం (ప్రింటులో) | .... |
| 66. | గోమాత | 40-00 |

## 2. స్తోత్రాలు-సుప్రభాతములు సహస్రనామములు

| | | |
|---|---|---|
| 1. | శ్రీ లలితా విష్ణు సహస్రనామస్తోత్రాలు<br>పురాణపండ రాధాకృష్ణమూర్తిగారి సంకలనం | 45-00 |
| 2. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (హిందీ) ,, | 50-00 |
| 3. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రములు (ఇంగ్లీషు) ,, | 50-00 |
| 4. | స్థూలాక్షరిలలితావిష్ణుసహస్రనామస్తోత్రములు(పత్రికసైజ్) | 99-00 |
| 5. | లలితావిష్ణు (కేస్ బైండ్) 1/8 డెమ్మి | 63-00 |
| 6. | స్థూలాక్షరీ లలితావిష్ణు (క్రౌన్‌సైజు)కేస్‌బైండ్ | 108-00 |
| 7. | సర్వదేవతా స్తోత్రమంజరి | 120-00 |
| 8. | సకలదేవతా అష్టోత్తరశతనామావళిః (63) | 24-00 |
| 9. | విష్ణుసహస్రనామస్తోత్రమ్ (క్రౌన్) | 25-00 |
| 10. | లలితా సహస్రనామ స్తోత్రమ్ (క్రౌన్) | 36-00 |
| 11. | లలితా సహస్రనామములు | 24-00 |
| 12. | లక్ష్మీ సహస్రనామములు | 24-00 |
| 13. | దుర్గా సహస్రనామములు | 24-00 |
| 14. | ఆంజనేయ సహస్రనామములు | 24-00 |
| 15. | శివ సహస్రనామములు | 24-00 |
| 16. | విష్ణు సహస్రనామములు | 24-00 |
| 17. | గణపతి సహస్రనామములు | 24-00 |
| 18. | సుబ్రహ్మణ్య సహస్రనామములు | 24-00 |
| 19. | గాయత్రి సహస్రనామములు | 24-00 |
| 20. | లలితావిష్ణు సహస్రనామస్తోత్రాలు | 24-00 |
| 21. | శ్రీరామా సహస్రనామములు | 24-00 |
| 22. | సరస్వతి సహస్రనామములు | 24-00 |
| 23. | సూర్యసహస్రనామములు & ఆదిత్యహృదయం | 24-00 |
| 24. | శ్రీవేంకటేశ్వరసహస్రనామములు | 24-00 |
| 25. | మణిద్వీపవర్ణన (పెద్దది) | 24-00 |
| 26. | సంధ్యావందనం | 24-00 |
| 27. | మంత్రపుష్పమ్ | .... |
| 28. | త్రిభాషా హనుమాన్‌చాలీసా | 15-00 |
| 29. | హనుమాన్ చాలీసా | 10-00 |

